# నవ జీవనం



పర్యావరణ పరిరక్షణ
(సంగీత రూపకం)
మన కొద్దు సారా
(వ్యాసం)

డా॥ నాగినేని భాస్కరరావు

# నవజీవనం

(పర్యావరణ రక్షణ - సంగీత రూపకం)

మనకొద్దు సారా - వ్యాసం


**డా॥ నాగినేని భాస్కర రావు**

M.B.B.S., FCGP
P.G. Certificate in GERIATRICS



ప్రచురణ :

**యువభారతి,**

సాహితీ సాంస్కృతిక సంస్థ

రిజిస్టర్డు : 1/64,

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు,

తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

**NAVA JEEVANAM**

A Ballet on Protection of Environment
& An essay on the Prevention of Alcoholism
by
**Dr. NAGINENI BHASKAR RAO,**



Published by
YUVABHARATHI, (A literary and Cultural organisation)
Andhra Saraswatha Parishad Buildings, Hyderabad-500 001.

| | | |
|---|---|---|
| Publication No | : | 167 |
| 1st Edition | : | 21-8-2003 |
| Copies | : | 1000 |
| Cover Design | : | Seela Veerraju |
| Price | : | Rs. 30/- |

Cover & Book Printed at : Sri Balaji Art Printers,
Chikkadpally, Hyderabad - 20.
Ph : 27638326

సోల్‌డిస్ట్రిబ్యూటర్సు : నవోదయ బుక్ హౌస్, ఫోన్ : 24652387
ఆర్యసమాజమందిర్ ఎదురుగా,
సుల్తాన్ బజార్, హైదరాబాదు-500 027.

ప్రతులకు : 1) యువభారతి కార్యాలయం,
ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు,
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

2) శ్రీ ఫణి భరత్ S/o డా॥ భాస్కరరావు
5-91, స్టేషన్ రోడ్డు, మధిర - 507 203,
ఖమ్మం జిల్లా., ఆం.ప్ర.

# అంకితం

ఆప్తమిత్రుడు

శ్రేయోభిలాషి, సాహిత్యపిపాసి

**కీ॥శే॥ కె.వి.కామేశ్వరరావు**కు



**21-8-2003** — డా॥ నాగినేని భాస్కరరావు

# ముందు మాటలు

సాహిత్య ప్రసారం ద్వారా సమాజంలో సౌమనస్యాన్ని పెంపొందిస్తూ మంచికోసం, మానవతకోసం, పురోగతికోసం యువభారతి కడచిన 37 సంవత్సరాలుగా వివిధ సాహితీ కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తున్నది. ఇంతవరకు 166 గ్రంథాలను ప్రచురించింది. గత సంవత్సరం డిసెంబరులో 'హాస్యలహరి' పేరుతో ఉపన్యాస వ్యాసాలను ప్రచురించి, సహృదయలోకానికి సమర్పించిన సంగతి విజ్ఞులకు తెలిసిందే. యువభారతి కార్య పరంపరలో యువభారతి సభ్యుల రచనలను ప్రచురించడం కూడా ఒకటి. ఈ కోవలో ప్రచురితమైనదే కవిమిత్రులు డా॥ నాగినేని భాస్కరరావు గారి ఈ 'నవజీవనం' అనే సంగీతరూపకం. ఈ రూపకం వచనగేయ దృశ్యశ్రవ్యరూపకం ; వస్తు ప్రధానమైన ఈ రూపకం ప్రజోపయోగకరమైనది.

మిత్రులు డా॥ నాగినేని భాస్కరరావు గారు స్నేహశీలి; దయాశాలి; యువభారతి క్రియాశీల సభ్యులలో ఒకరు. వారు వృత్తిరీత్యా వైద్యులు ; ప్రవృతిరీత్యా సాహిత్య విద్యాసక్తహృదయులు. ఉభయ రంగాలలోనూ ఉత్తమ సేవాభావంతో కృషిచేస్తున్న సహృదయవరేణ్యులు. వారు ఇప్పటికే అనేక గ్రంథాలను రచించి ప్రకటించారు. 'మేం' 'ఆక్సీజన్,' 'సమాజశిల' అనే కవితా సంకలనాలు వారికి కవిగా మంచి గుర్తింపు తెచ్చాయి. వారు 'వ్యక్తిత్వ వికాసం-ఆరోగ్యసూత్రాలు' అనే వచన గ్రంథాన్ని ఇటీవలే ప్రచురించారు. 'మహతి' వ్యాససంపుటిలో వారు రచించిన 'విద్యార్థిలోకం' అనే వ్యాసం వారి విశాలావగాహనకు నిదర్శనం. అటు - 'శివానంద రిహేబిలిటేషన్‌హోం'లో వైద్యులుగా మందులతో శరీరాన్ని బాగుచేస్తూ, ఇటు - కలంపట్టి సాహితీ సుధను అందిస్తూ మనస్సులను వికసింపజేసి ఆనందింపజేస్తున్న మిత్రులు డా॥ నాగినేని భాస్కర రావుగారు అభినందనీయులు.

దినం దినం కలుషితమైపోతున్న పర్యావరణాన్ని ఎలా

పరిరక్షించుకోవాలో తెలిపే రూపకం ఈ 'నవజీవనం'. ఈ నాడు మానవుని నవజీవనానికి అనివార్యంగా అవసరమైనది ఏమిటో, పర్యావరణం అంటే ఏమిటో, జలకాలుష్యం ఎలా జరుగుతున్నదో, ఆ కాలుష్యం వల్ల వ్యాపించే వ్యాధులెలాంటివో, జల కాలుష్యనివారణకు తీసుకోవలసిన జాగ్రత్తలెలాంటివో చక్కగా శాస్త్రీయంగా ఈ రూపకంలో వివరించారు డా॥ భాస్కరరావుగారు. అలాగే వాయుకాలుష్యాన్ని గూర్చి, ఘనపదార్థవ్యర్థాలను గూర్చి, చెట్ల పరిరక్షణను గూర్చి ఈ రూపకంలో విశదీకరించి, ప్రకృతి సమతౌల్యాన్ని ఎలా సాధించాలో సూచించారు. పర్యావరణకాలుష్య కారణాలనూ, దాని వల్ల కలిగే అనర్థాలనూ చెపుతూనే పర్యావరణ పరిరక్షణోపాయాలను కూడా సూచించి, డా॥ భాస్కరరావు గారు చాలా మంచి పని చేశారు. శాస్త్రపదజాలం గేయంలో ఒదుగడం కష్టం. అయినా, శాస్త్రీయ వ్యాసాంశాన్ని సంగీతరూపకంగా మలచి జనబాహుళ్య ప్రచారానికి అవకాశం కల్పించారు రచయిత శ్రీ భాస్కరరావుగారు. ఈ రూపకం ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుండి ప్రసారం కావడం కూడా రూపకం ప్రయోజనాన్ని చాటుతున్నది.

ఈ 'నవజీవనం' ప్రజానీకానికి నవజీవనాన్ని ప్రసాదించడంలో దోహ ం చేస్తుందని భావిస్తున్నాను. సహృదయ కళాకారులు దీనిని బాగా ఆదరి ి ప్రచారాన్ని కలిగించి ప్రయోజనాన్ని సాధిస్తారని ఆశిస్తున్నాను.

గతంలో యువభారతి ప్రచురణలను సమాదరించిన సహృ యులు ఈ రూపకాన్ని కూడా ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను. ఈ రూపక న్ని ప్రచురించే అవకాశాన్ని యువభారతికి కల్గించిన మిత్రులు డా॥ నాగినే స్కరరావు గారికి హార్దిక కృతజ్ఞతాభివందనాలు.

హైదర బ ను
21.8.2 ( 

— డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
అధ్యక్షులు,
యువభారతి.

# ఆయన 'అక్షరాలా' డాక్టర్.....!

ఎందరో రచయితలు వున్నా, సామాజిక స్పృహ వున్న రచయితల సంఖ్య తక్కువ అనే చెప్పాలి. అందుకే 'ఉత్తమ' రచయితలు కొందరే వుంటారు. మిగతా వారు 'ఉత్త' రచయితలూ - 'ఉత్తర' రచయితలూనూ!

సాహిత్యాభిమానులకు చిరపరిచితమైన పేరు - డాక్టర్ నాగినేని భాస్కరరావు గారిది.

ఆయన 'అక్షరాల' డాక్టరు... 'అక్షరాలా' డాక్టరు... ఆయన భేషజాల మేఘాలు కమ్మని 'కమ్మని' డాక్టరు... రోగుల పట్ల మానవతా దృక్పథంగల మా మంచి డాక్టరు...

ఆయన ఆక్సిజన్ (1991), దేశంకోసం శాస్త్ర విజ్ఞానం (1988) సమాజ శిల (2000) కవితా సంకలనాలను, వ్యక్తిత్వ వికాసము - ఆరోగ్య సూత్రాలు (2001) అనే, 'వైద్య కరదీపిక' వంటి రచనలను 'ఆమూల'-'అగ్రం'- గాకుండా, 'ఆమూలాగ్రంగా' చదివితే 'పరుల కోసం పాటు పడదాం' - 'పరుల కోసం పాట పాడదాం' - అనే ఆయన తత్వం, మనకి స్పష్టంగా అవగాహన అవుతుంది.

డాక్టర్ గారి ఈ 'నవజీవనం' - మానవ జీవనం ఆయురారోగ్యాలతో హాయిగా గడవడానికి అనేక విషయాలు తెలియజేస్తుంది.

పర్యావరణ పరిరక్షణపై డాక్టర్‌గారు రాసిన ఈ సంగీతరూపకంలో పంచభూతాలైన - గాలి, నీరు, నేల, ఆకాశం, అగ్ని - ఈ అయిదూ 'అనంతం' అని మనిషి భావిస్తూన్నా, వీటికీ పరిమితులు వున్నాయి - అనే సత్యం గోచరిస్తుంది. ముఖ్యంగా జీవనాధారం అయిన నీరు - 97 శాతం - సముద్రంలోనే వుంది. సముద్రజలాలు సేద్యానికి గాని, సేద దీరడానికి గాని పనికిరావు. మిగిలిన మూడు శాతంలో మనిషికి ఉపయోగపడే నీటిశాతం - ఒకటి కన్నా తక్కువే! ఇది

ఆందోళన కలిగించే విషయమే అయినా, శాస్త్రీయ సత్యం! నీటిని వృథా చేయడం, అవసరానికిమించి ఉపయోగించడం వల్ల - భవిష్యత్ తరాలలో నీటి కొరత ఎంత తీవ్రంగా వుంటుందో ఊహించమంటున్నారు రచయిత... అలాగే చెట్లను నరికివేయడం, కొత్త వృక్ష సంపదను పెంచకపోవడం, వాహన కాలుష్యం, ఇత్యాది వాటివల్ల ఎన్నెన్ని ఉపద్రవాలు రావచ్చో తెలియ జేయడమే గాకుండా, తగిన జాగ్రత్తలు ఎలా తీసుకోవాలో కూడా - రచయిత - ఈ నాటికలో తెలిపారు.

సోదాహరణమైన ఈ గేయనాటికను చూడడం, వినడం, చదవడం ప్రతి వారికీ ఎంతో అవసరం... ఎందుకంటే - ఇది ఎవరి గురించో కాదు. మనందరి గురించీ... మన పర్యావరణ పరిరక్షణ గురించీ... మన అందరి ఆరోగ్యం గురించీ...!

భావరాగయుక్తంగా ఈ చక్కని గేయ నాటిక, విద్యా సంస్థలలోనూ, మురికి వాడలలోనూ, గ్రామాల లోనూ - వీలైనన్ని చోట్ల ప్రచారం కావాలని ఆశిస్తున్నాను.

డాక్టర్ నాగినేని భాస్కర రావు గారు, మా శివానంద కేంద్రంలో వైద్యులు కావడం మా అందరికీ గర్వకారణం.... ఆనంద దాయకం!

**ప్రొఫెసర్ (డాక్టర్) పి. హృషికేశ్**

శివానంద రిహాబిలిటేషన్ హోం
చీఫ్ ఎడ్మినిస్ట్రేటర్
ఆం.ప్ర., డైరెక్టరేట్ ఆఫ్ హెల్త్ సర్వీసెస్,
మాజీ డైరెక్టర్,
ఉస్మానియా మెడికల్ కాలేజి
సోషల్ అండ్ ప్రివెంటివ్ మెడిసిన్
విశ్రాంత ఆచార్యులు

15.8.2003
శివానంద
రిహాబిలిటేషన్‌హోం
కూకటపల్లి,
హైదరాబాదు - 72.

# పర్యావరణ పదవల్లరి

కుక్కపిల్లా అగ్గిపుల్లా కాదేది కవితకనర్హం అన్నారు మహాకవి. అదే స్ఫూర్తితో డాక్టర్ నాగినేని భాస్కరరావు గారు ప్రతి ఒక్కరికి ప్రాణాస్పదమైన పర్యావరణ సమస్యలు తీసుకుని "నవ జీవనం" అనే ఈ గేయ నాటిక రాశారు. కావాలోయ్ నవ కవనానికి అనే ఆయన పాట తరహాలో పర్యావరణ గీతాన్ని రాసి జత చేశారు. శ్రీశ్రీ కి క్షమాపణలతో అని ఆయన చివర రాశారు గాని నిజానికి అక్కర్లేదు. తెలుగు నేలలో ప్రతి రెండో వారూ కవి అని సగర్వంగా ప్రకటించిన శ్రీశ్రీ తరతమ స్థాయిలలో రకరకాల రచనలు రావడాన్ని ఎప్పుడూ స్వాగతించేవారనేది తెలిసిన విషయమే.

సాధారణంగా కవిత్వం సామాజిక లేదా వ్యక్తిగత సమస్యలకు సంబంధించినదై వుంటుంది. స్వతహాగా భాస్కరరావు కూడా సామాజిక చైతన్య ప్రధానమైన కవిత్వం రాస్తారు. రాష్ట్రంలో, ప్రత్యేకించి అటు ఖమ్మం జిల్లాలోనూ, ఇటు హైదరాబాదులోనూ కూడా ప్రగతిశీల మిత్రులకు సాహిత్య జీవులకు సుపరిచితులు. వృత్తి రీత్యా వైద్యులైనా ప్రవృత్తి రీత్యా సాహిత్యరంగంతో ఆయన సహజీవనం. సైన్సుకు సంబంధించిన రచనలు చేశారు. కవిత్వ సంపుటాలూ వెలువరించారు.

ఇక ఇప్పుడు మన ముందుంచుతున్న "నవ జీవనం" పర్యావరణ సమస్యను సులభమైన భాషలో వివరించే గేయ నాటిక. భాస్కరరావు ఎలాంటి అనవసర అలంకారాలు లేకుండా మామూలుగా మాట్లాడుకునే విధంగా పర్యావరణ పరిరక్షణ ప్రాధాన్యతను కళ్లకు కట్టారు. పంచ భూతాలుగా పిలవబడు గాలి, నేల, నీరు, ఆకాశం, అగ్ని ఎలా కలుషితమైపోతున్నది వివరించారు. దీన్ని ప్రదర్శించేది పిల్లలు గనక వారి పరిధిలోనే రచన సాగుతుంది. ఈ విధంగా సులభంగా రాయడం వల్ల దీన్ని ఎవరైనా నేర్చుకోవడానికి, ప్రదర్శించడానికి వీలవుతుంది.

పర్యావరణ పరిరక్షణ పట్ల గుర్తింపు పెరుగుతున్న నేపథ్యంలో ఇలాంటి రచనల అవసరం చాలా వుంది. ఇటీవలి వరకూ కూడా దైనందిన జీవితంలో గాని, రాజకీయ ఆర్థిక నిర్ణయాలలో గాని ఈ మెళకువ ఇంతగా వుండేది కాదు. ప్రకృతిలో వనరులు కూడా క్రమేణా హరించుకుపోతాయని, మానవ చర్యల వల్ల దాని సమతుల్యత దెబ్బతింటుందని అర్థమవుతున్నకొద్దీ దాన్ని కాపాడేందుకు ఏం చేయాలన్న స్పృహ పెరుగుతున్నది. శాస్త్రజ్ఞులు వివిధ కారణాల వల్ల

కాలుష్యం వ్యాపిస్తున్న తీరును గుర్తించి ప్రజలను హెచ్చరించగలుగుతున్నారు. ఆ వైజ్ఞానిక సందేశాన్నే భాస్కరరావు ఈ గేయ నాటికలో పాటల చరణాలుగా పొందుపరచారు. నీటి కాలుష్యం, వాహన కాలుష్యం, పారిశ్రామిక వ్యర్థ పదార్థాలు, ఆస్పత్రుల వ్యర్థాలు, విషపదార్థాలు ఇలా విస్తరిస్తున్న కాలుష్య ప్రమాదాన్ని పాటలుగా కట్టి చూపించారు. అందుకు నివారోణపాయాలూ సూచించారు. వ్యాసాలుగా రాసినప్పటి కంటే దృశ్య శ్రవణ రూపాలలో దీన్ని రూపొందించి ప్రజలలోకి తీసుకు వెళ్లడంవల్ల తెలియనివారు తెలుసుకోవడానికి, తెలిసినవారు మరింత జాగ్రత్త పడటానికి అవకాశముంటుంది. అందుకే ఈ రచన ఆహ్వానించదగినది.

చివరగా ఒక మాట. మిగిలిన అన్ని అంశాలలాగే పర్యావరణం కూడా రాజకీయాలతో, దోపిడీతో ముడిపడి వుంది. ప్రపంచం ఎదుర్కొనే అనేక కాలుష్య సమస్యలకు మూలకారణం సామ్రాజ్యవాద దేశాల ధనాశ, ఆధిపత్య కాంక్ష. ఒకప్పుడు మన దేశం వంటి వర్థమాన దేశాలన్నిటిని ఆక్రమించి కొల్లగొట్టి దొల్ల చేసిన వారు ఇప్పుడు పర్యావరణ పేరిట ప్రతిదాన్ని అడ్డుకుంటున్నారు. అదే సమయంలో ప్రపంచంలో అతి ప్రధాన కాలుష్య కారకాలైన పరిశ్రమలు, సంస్థలు ఆ దేశాలకు చెందిన బహుళ జాతి సంస్థలే. దాదాపు రెండు దశాబ్దాలుగా పీడకలగా మనను వెన్నాడుతూనే వున్న భోపాల్ దుర్ఘటన ఇందుకో ఉదాహరణ మాత్రమే. అలాగే దేశంలో కూడా కొన్ని బడా సంస్థలు, అసాంఘిక శక్తులు బాధ్యతా రహితంగా కాలుష్య వ్యాప్తికి దారితీసే పద్ధతులు అనుసరించడం చూస్తుంటాము. సమైక్యంగా వాటిని నివారించుకోవడానికి కృషి చేస్తూ మరో వైపు ఎవరి పరిధిలో వారు ప్రకృతి సమతుల్యతను కాపాడుకోవాలి. పరిసరాల పరిశుభ్రతను పరిరక్షించాలి. అప్పుడే "జీవనం" నిజమవుతుంది.

అర్థవంతమైన, అవసరమైన అంశాలు రాసినందుకు డాక్టర్ భాస్కరరావుకు మరోసారి అభినందనలు తెలియజేస్తున్నాను. పాఠశాలలు, ప్రభుత్వ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు ఈ గేయనాటికను ఉపయోగించుకుంటాయని ఆశించాలి.

తేది : 14.8.2003
హైదరాబాదు

**- తెలకపల్లి రవి**

ఎడిటర్, ప్రజాశక్తి ప్రచురణలు

# ఈ పుస్తకం ఎందుకంటే...

మన భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 56 సంవత్సరాలైనా ఆర్థికంగా అప్పుల్లో కూరుకున్నట్లే - మనం పరిశుభ్రత, పరిసరాల పరిరక్షణ విషయంలోనూ అంతే వెనుకబడివున్నాము.

ప్రతి గ్రామం ముందు యింకా ప్రజలు ప్రాత: కాలాన చెంబులు పట్టుకుని పరుగెడుతున్నారు. బహిరంగ ప్రదేశములో మలము, మూత్రములు విసర్జించుట యింకా ఈ దేశ ప్రజల అలవాటుగానే వున్నది. చెరువుల్లో, కుంటల్లో బట్టలు ఉతకడం, స్నానం చేయటం, పశువులు కడగటం వంటివి జరుగుతూనే వున్నాయి. పట్టణాల్లో అయితే అసలు నీరే కరవు.

త్రాగునీటిని, సాగునీటికి యింకా ప్రజలు అవస్థలు పడుతున్నారు. నదులలో 97శాతం నీరు వ్యర్థంగా సముద్రంలో కలుస్తున్నది. రక్షితనీరు ప్రజలకొక ఎండమావిగానే వున్నది.

గాలి సరిగ్గా లేని నివాసాల్లో ఎందరో తమ బ్రతుకులు వెళ్లదీస్తున్నారు. పేదరికం తన ప్రతాపాన్ని అభివృద్ధి చెందని ప్రపంచంలో ప్రదర్శిస్తున్నది.

ప్రజలు తమకు అవసరం లేని పదార్థాన్ని తమ ఇంటిలోంచి లేక పొలంలోంచి లేక పరిశ్రమలోంచి విచ్చలవిడిగా పారేస్తున్నారు. పరిసరాల కాలుష్యం సృష్టిస్తున్నారు.

నీటిని రకరకాలుగా కలుషితం చేస్తున్నారు. గాలి కూడా పెరిగిన వాహనాలు విడుదలన్తున్న వ్యర్థ వాయువులవల్ల పరిశ్రమల నుండి విషవాయువులవల్ల, ఇంకా యితర కారణాల వల్ల కలుషితం అవుతున్నది.

వీటి కాలుష్యాన్ని ప్రభుత్వం చక్కదిద్దలేని పరిస్థితిలో వున్నది. ప్రభుత్వంతో పాటు ప్రజలూ నడుంబిగించి - నీటి కాలుష్యాన్ని, గాలి కాలుష్యాన్ని, ఘనపదార్థాల కాలుష్యాన్ని నివారించుకోవాలి. ఆరోగ్యవంతమైన పరిసరాలను నిర్మించుకోవాలి.

అందుకు చేసిన ప్రయత్నమే - నా పుస్తకం 'నవజీవనం'. ప్రాథమిక పాఠశాల స్థాయి నుండి విద్యార్థులందరూ నేర్చుకోవలసిన పాఠాలు అవి. వాటిని గమనంలోనికి తీసుకుని తగు చర్యలను చేపట్టి నీటి, గాలి, ఘనపదార్థాల కాలుష్యాలను అరికట్టాలి. చెట్లను విస్తారంగా పెంచి ప్రకృతిలో సమతుల్యాన్ని తేవాలి. ఈ సంగీత రూపకం ప్రతి పాఠశాలలో గ్రామాల్లో, పట్టణాల్లో ప్రదర్శించటానికి వీలుగా వుంది. దీనిని విద్యార్థిలోకం, యువత ప్రదర్శించి ప్రజల్ని చైతన్యపరచాలని కోరుతున్నాను.

ఈ రచనను నేను చేయుటకు కారణమైన నా మిత్రులు డా॥ రంజిత్, హైదరాబాదు వార్కి నా కృతజ్ఞతలు.

ఈ రచన నిర్మాణానికి సూచనలిచ్చి ప్రోత్సహించటమే కాక ఆవిష్కరణ సభలో 'నవజీవనాన్ని' పరిచయం చేసిన ప్రముఖ కవి, ప్రియమిత్రులు ఆచార్య ఫణీంద్రగార్కి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు. 'నవజీవనం' కు ముఖపత్రాన్ని రచించి అందులోంచి అచ్చుతప్పుల కాలుష్యాన్ని నివారించిన ఆత్మీయులు, శ్రేయోభిలాషులు ప్రముఖ చిత్రకారులు శ్రీ శీలావీర్రాజు గార్కి హార్థిక కృతజ్ఞతాభివాదములు.

దీనిని ప్రచురించుటకు లహరి వరుసలో అధిక ఆర్థిక సహకారమును అందించిన ప్రియ మిత్రులు శ్రీ యస్.వి. ప్రభాకరరావు గార్కి ధన్యవాదములు. 'నవజీవనంకు' ముందుమాట వ్రాసి ఆశీర్వదించిన మా యువభారతి అధ్యక్షులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగార్కి, ఇంకా ఆచార్య వంగపల్లి విశ్వనాథం గార్కి, శ్రీ రెడ్డి రాఘవయ్య గార్కి, శ్రీ ఎస్ వేంకటేశ్వర్రావు గార్కి మరియు శ్రీ మాడభూషి అనంతాచార్యులు గార్కి ధన్యవాదములు.

సారామహమ్మారి : అనేక వేల సంవత్సరములనుండి మానవాళిని పీడిస్తున్నది సారా మహమ్మారి. దానిని మన సంఘంనుండి పారద్రోలవలసిన అవసరం ఎంతైనా వున్నది. కనుక సారా గురించి, దాని చెడుఫలితాలను గురించి త్రాగటాన్ని మానాల్సిన అవసరం గురించి నవ్యాసమే 'మనకొద్దుసారా'. ఇది ప్రజలందరూ కలిసి ఉద్యమిస్తేనే సాధ్యమౌతుంది. నవజీవనానికి నాంది పలుకుతుంది.

ఈ నా పుస్తకాన్ని చెప్పకుండా కనుమరుగై పోయిన కీ॥శే॥ కె.వి.కామేశ్వరరావు కు అంకితమిస్తున్నాను. యువభారతి తరుపున, నా తరపున. అంగీకరించిన శ్రీమతి కె.బి. లక్ష్మి గార్కి కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని అందంగా అచ్చువేసిన శ్రీ బాలాజీ ఆర్టు ప్రింటర్సు, చిక్కడపల్లి, అధినేత శ్రీ బాలాప్రసాదు గార్కి కృతజ్ఞతలు.

నా రచనా వ్యాసాంగంలో ఎప్పుడూ సహకరిస్తున్న నా కుమారులు డా॥భారవి, ఫణిభరత్ మరియు అర్థాంగి శ్రీమతి శారదాంబలకు ఆశీస్సులు.

'నవజీవనాన్ని' దేశప్రజలు అందుకోవాలని కోరుతూ

క్వార్టరు నెం.3
శివానంద రీహాబిలిటేషన్
కూకట్ పల్లి, హైదరాబాదు-72
తేది : 21-8-2003

-- డా॥ నాగినేని భాస్కరరావు

# విషయ సూచిక

## ప్రత్యేక ధన్యవాదములు

ఈ పుస్తక ప్రచురణకు ఉదారంగా
ఆర్థిక సహాయమందించిన ప్రియమిత్రులు,
యువభారతి మాజీ కార్యదర్శి

- శ్రీ ఎస్. వి. ప్రభాకరరావు గారికి

- నాగినేని భాస్కరరావు

### పాత్రలు, వేషధారణ

సూచన :

1. మాస్టరు : వయస్సు సుమారు 50 సం॥లు
   వేషం : తెల్లని లాల్చీ / షర్టు, తెల్లని పైజామా/ఫాంటు
   నెత్తిపై నీలం/ఎర్రని టోపీ, చేతిలో ఆకుపచ్చరుమాలు,
   కాళ్లకు కాన్వాసు బూట్లు (తెల్లవి)
2. 1వ బృందం : వయస్సు : 18 - 25 సం॥
   ఇద్దరు లేక ముగ్గురు : నీలం రంగు చొక్కా/లాల్చీ
   నీలం రంగు ఫాంటు/పైజామా, తలకు నీలంటోపి/రిబ్బన్.
3. 2వ బృందం : (ఇద్దరు లేక ముగ్గురు) :
   తెల్లని దుస్తులు (పైవిధంగా)
4. 3వ బృందం : (ఇద్దరు లేక ముగ్గురు) :
   కాకీ దుస్తులు (పైవిధంగా)
5. 4వ బృందం : (ఇద్దరు లేక ముగ్గురు) :
   ఆకుపచ్చ దుస్తులు (పైవిధంగా)

**ముందుగా - నేపథ్యంలో ప్రస్తావన / ప్రార్థనగా :**

**అందరూ కలసి :** ఆక్సీజన్, చెట్ల వాయువులు
ధూమం వదలని వాహనాలు
వంటకు పొగరాని పొయ్యిలూ
పొగలేపని కట్టెల గుట్టా
భద్రతగల పబ్లిక్ రవాణా
ధారాళంగ వెలుతురుజల్లు
- కావాలోయ్ నవజీవనానికి

మరగించి చల్లార్చిన నీరు
మళ్లించిన నదీ ప్రవాహం
కుదురుకునే సేంద్రియ ఎరువూ
బావిచుట్టూ సిమెంటుచప్టా
విసిరేసిన ప్లాస్టిక్ వ్యర్థం
సరిచేసిన డ్రైనేజీ కాల్వలు
- కావాలోయ్ నవజీవనానికి.

మంచి నీటి ధారల చప్పుడు
కాలుష్యకాల చావుకేక
జనారణ్య మొక్కల గర్జన
ఆస్పత్రుల ఇన్సినిరేటర్
పెరిగిన చెక్ డ్యాముల సంఖ్యా
కాలుష్య నివారణ రావం
- కావాలోయ్ నవజీవనానికి

మనరోగాల్ని త్రుంచేటిదీ
ఆరోగ్యాన్ని పెంచేటిదీ
పర్యావరణను రక్షించేదీ
పెను మూర్ఖతనొదిలించే
ప్రకృతి సహజ బ్రతుకిచ్చేదీ
-కావాలోయ్ నవజీవనానికి

మహాకవి శ్రీశ్రీ కి క్షమాపణలతో
(18.4.2001 నాటి రాత్రి 8.30 గంటలకు ఆకాశవాణి, హైదరాబాదు, 'ఎ' కేంద్రం నుండి ప్రసారితం)

# నవజీవనం

(పర్యావరణ రక్షణపై సంగీత రూపకం)

మాస్టరు : ప్రియమైన ప్రజలారా ప్రణామములు. ఈ భూమిపై అధిక జనాభా, ఆధునికీకరణ, పారిశ్రామికీకరణ, పట్టణీకరణల వల్ల అనేక అనర్థాలు జరుగుతున్నాయి. నీటి కొరత, వసతి కొరత ముఖ్యంగా పర్యావరణ కాలుష్యం జరిగి మానవాళినేకాక సమస్త జీవరాశికి ఇబ్బందులు కల్గుతున్నాయి. అవి ఎలా జరుగుతున్నవి, వాటి పరిష్కారాలు ఏమిటో మా విద్యార్థులు - పర్యావరణ పరిరక్షక బృందం వివరిస్తుంది. విని మీరూ పర్యావరణ పరిరక్షక బృందంగా ఏర్పడి మీ పరిసరాలను రక్షించుకోండి. ప్రకృతి సహజత్వాన్ని కాపాడండి.

బృందం : పంచభూతాలుగా పేరొందిన గాలి, నీరు, నేలా, శక్తి(అగ్ని), ఆకాశము అనంతమని ఇష్టం వచ్చినట్లు వాటిని మనం వినియోగిస్తున్నాం. అవి అనంతం కాదు. వీటికి పరిమితులున్నాయి. ఉదాహరణ నీరునే తీసుకోండి. మన భూగోళంలో ఉన్న నీరు 97శాతం సముద్రాల్లో వున్న కేవలం 1శాతం కన్నా తక్కువ మనకు ఉపయోగంలోకి వస్తున్నది. కనుక నీటిని జాగ్రత్తగా వాడుకోవాలి. నీరు దాని కాలుష్యం-నివారణ గురించి చెప్తాం. ఆలకించండి.

1వబృందం:

పల్లవి: నీరే కావాలి రక్షిత నీరే కావాలి
పారే వర్షపు నీరు పొలాలకు మళ్లాలి
నరజాతికంతటికీ ఆరోగ్యం కలగాలి
తరతరాలకు సరిపడే పంటలు పండాలి.

చరణం 1 : ప్రపంచాన పంచభూతాల్లో ఒకటిరా
మన ప్రకృతి సమస్త జీవులకు పంచిన సొత్తురా
తాపం, జీవక్రియల రూపం తీర్చునురా
పాపం మనిషికి, చెట్టుకు ప్రాణం నీరురా.

చరణం 2 : మబ్బుల్లో, వానలు, మంచుకొండల్లో, మంచు
అబ్బురముగా నిల్వ చేసే ఆనకట్టలూ
అంబుధులు, నదులు, అవనీగర్భమ్ము
అద్భుతముగ జీవాలు నీటి స్థానాలు.(SOURCES)

చరణం 3 : యుగయుగాలుగా జనజీవనం నీటితోనే
నాగరికతా పరిణామగతీ నీటితోనే
సాగరజల మపారం వాడుక కది దూరం.
సాగే నది నీరే మనిషికి ఆధారంరా.

మాస్టరు: అయితే ఇప్పుడొచ్చిన ప్రమాదం ఏమిటి?

1వబృందం

చరణం: పెరిగిన జనాభాతో పెరిగిన పట్టణాలూ,
పెరిగిన పరిశ్రమలు, పెరిగిన వాహనాలు
పర్యావరణ సూత్రాల పట్ల అలక్ష్యం
కల్గిస్తున్నాయి నీటి కాలుష్యం.

మాస్టరు: ఇంతకీ కాలుష్యం ఎలా జరుగుతుందో వివరించండి.

1వబృందం

పల్లవి: రకరకాలుగా అవుతోంది జల కాలుష్యం
సకల విధాల కలుగుతుంది అనారోగ్యం.

చరణం 5 : నూతి దగ్గరా, గొట్టపు నూతి దగ్గరా
రీతి మరచి చెరువు, ఏటి దగ్గరా
భీతి లేక గుడ్డలుతికి పశువుల కడిగితే
నీతి విడిచి పరిశ్రమ, గృహవ్యర్థ్యం వదిలితే

॥రకరకాలుగ॥

చరణం 6 : మీరు తాగు నీటి పైపుల ప్రక్కనే
మురుగు నీటి పైపులుంటే, వరదనీరుంటే
పైరుల కేసే రసాయనిక ఎరువులుంటే
పురుగుల చంపే మందులుంటే- బహిరంగంగా
పౌరులు చేసే మల, మూత్రాలే ఉంటే

॥రకరకాలుగా॥

చరణం 7 : పంచదార కర్మాగారాలందునా
కంచు, తోలు, మందుల కార్ఖానాల్లోపల
ఉంచిన పర్యావరణ రక్షణ సూత్రాల
త్రుంచి వేసి వ్యర్థాలను పొలాల్లో
మంచినీటి వాగుల్లో, నదుల్లో వదలితే
||రకరకాలుగా||

చరణం 8 : వరదకు కొట్టుకొచ్చే మృత కళేబరాలు
మరణించిన జలచరాలు, కుళ్లిన వృక్షాలు
పవిత్రంగా ఎంచే పుష్కర స్నానాలు
కార్తీక దీపాలు, విగ్రహ నిమజ్జనాలు
కరకు కాలుష్యం కల్గించే కారకాలు.
||రకరాలుగా||

చరణం 9 : పల్లెటూళ్లలో, పట్టణాలలో, నగరాల్లో
కుళ్లను వెదజల్లే డ్రైనేజీ గుంతల్లో
చల్లని నీటి సరఫరాలోని అశ్రద్ధలో
పరిశుభ్రత లేని నీటి సరఫరాలో
చాలని భద్రతల జరిపిన అణు పరీక్షలతో
తినుబండారాలపై ఈగలు, దోమలతో
||రకరకాలుగా||

చరణం 10 : కూరలు, పండ్లపై చల్లిన క్రిమిసంహారకాలు
దారుల్లోన విసరబడ్డ ఆస్పత్రి వ్యర్థాలు
జోరుగ కక్షలు జలాశయాన కల్పిన విషాలు
పరిశుభ్రత పాటించక వాడే పాత్రలు
నీరు కలుషితమయ్యే కారకాలు - హానికరాలు
॥రకరకాలుగా॥

మాస్టరు: నీరు కాలుష్యం అయితే మనకేమి ప్రమాదమో అదీ చెప్పండి.

1వబృందం

చరణం 11 : కలుషిత జలంతో వస్తాయి కష్టాలు, నష్టాలు
కలరా, అమీబియాసిస్, కామెర్లు, కండ్ల కలకలు.
జలవిరేచనాలు, వాంతులు, గినియా పురుగు జబ్బులు
కలవర పరచే టైఫాయిడ్, చర్మవ్యాధులు.
ఇంకా-

చరణం 12 : బద్దెపురుగులూ, ఏలికపాములు మొదలైన
శుద్ధ పరాన్న జీవుల వల్ల అనేక జబ్బులు
శ్రద్ధ చూపినా కలుగు స్త్రీల గర్భ విచ్ఛిత్తి
కొద్దిగా నైనా పంటతగ్గు, పశువులు నశించు.

చరణం 13 : నిల్చిన కలుషిత జలంతో దోమలొస్తాయి
మలేరియా, ఫైలేరియాలు రెచ్చిపోతాయి
గాలిలో దుర్వాసనలు ప్రబలి బాధిస్తాయి

అలవిగానంతగ భూగర్భ జలం చెడుతుంది.

చరణం 14 : నీటిలో ఫ్లోరిన్ ఎక్కువై ఫ్లోరోసిస్
నీట అయోడిన్ తక్కువై థైరాయిడ్ వాపు
నీటిలో పారిశ్రామిక వ్యర్థమెక్కువైతే
నీటి జీవులు - చేపలు యితరాలు నశిస్తాయి.

మాస్టరు: ఐతే నీటి కాలుష్య నివారణకు, మంచి నీటి, సాగు
నీటి వృద్ధి కొరకు ఏం చేయాలి?

1వబృందం

పల్లవి : చెయ్యాలోయ్ జల కాలుష్య నివారణ
వెయ్యాలోయ్ రక్షిత నీటి ప్రణాళిక

చరణం 15 : సిమెంటు చప్టా కట్టాలీ బావుల చుట్టూ
ఏమైనా కడగొద్దురా మీ పశువుల నక్కడ
ఆమె, అతడు ఎవరైనా స్నానం చెయ్యొద్దక్కడ
ఏమాత్రం ఉతకొద్దు బట్టలనక్కడ.

చరణం 16 : పారవేయకు జలవనరుల వద్ద వ్యర్థాలను
విసర్జించకు బహిరంగంగా మల, మూత్రాలను
మీరంతా వాడాలి శౌచాలయాలను
ఆరోగ్యం కాపాడుకునే నిలయాలవి

॥చెయ్యాలోయ్॥

చరణం 17 : వరద నీటిలోకి, బహిరంగ ప్రాంతాల్లోకి

మురుగు నీటి పైపుల్ని వదలొద్దురా!

త్వరగా అందరూ చేయాలి నీటి సాగును

మరగించి చల్లార్చి తాగాలి నీటినెప్పుడూ.

చరణం 18 : కర్మాగారాలు, -ఉత్పత్తి కాసారాలు

కారాదు కాలుష్యపు కారాగారాలు

మరీ తక్కువ కాలుష్యం, ఎక్కువ ఉత్పత్తి

మర ప్రక్రియలే మనకిచ్చును సంతృప్తి

॥చెయ్యాలోయ్॥

చరణం 19 : వాడొద్దుర పరిశ్రమల - శుద్ధి చేయలేని

ముడిపదార్థాలు సరిగా బుద్ధి కలిగెనేని

విడువద్దు శుద్ధి పరచని మురుగునంతా

వీడి శ్రద్ధ, పరిశ్రమల వ్యర్థాల నుండి

॥చెయ్యాలోయ్॥

చరణం 20 : తగ్గించాలి పంటలకు రసాయన ఎరువులు

బాగా వేయాలి వేప క్రిమిసంహారిణులు

తగు రీతిని వాడాలీ సేంద్రియ ఎరువులు

దిగులు మరచి పొందాలి మరింత పంట.

చరణం 21 : క్రిమి సంహారక మందుల్లో వాడవద్దురా,

ఏమైనా వాతావరణంలో విచ్ఛిత్తి కాని,

ఏమైనా నీటి శుద్ధి కాని రసాయనాల్ని,

రామ రామ శుద్ధి కాని రసాయనాల్ని.

ఏమైనా ఎట్లైనా కృషి చేయాలి

క్రమేణా వాటి వాడకాన్ని నిషేధించాలి

॥చెయ్యాలోయ్॥

చరణం 22 : నిర్మించాలి చిన్న చిన్న చెక్ డాముల్ని

కోరి తీయాలి చెరువుల్లో పూడికల్ని

పోరి చేయాలి వాలు భూమిలో "బండింగ్"

పౌరులకై పెంచాలి భూగర్భ జల నిధుల్ని.

చరణం 23 : రోడ్లపై ప్రవహించిన వర్షపు నీరంతా

ఒడ్లు కట్టి ఇంకించాలి భూమికి మనమంతా

గడ్డుకాల మొచ్చినా దండిగా ఉండేట్లు

వాడాలి విచక్షణతో ప్రజలు నీటినెపుడు

॥చెయ్యాలోయ్॥

చరణం 24 : ఇంటింటా తవ్వాలి ఇంకుడు గుంతలు

ఇంటి కప్పులపై కురిసిన వాననీరు

ఇంటి చుట్టూ కురిసిన వర్షపుధారలు

నీటి రీసైక్లింగ్‌కు దీటైన దారులు.

చరణం 25 : అంట్లు తోమిన, బట్టలుతికిన నీటిని

అట్లే మన బాత్రూముల నీటిని

చెట్లకు, కూరగాయల తోటకు మళ్లించరా!

నీటి పొదుపుతో మన ఆదాయాన్ని పెంచరా!

మాస్టరు: ఇంకా ఏం చేయాలి.

1వబృందం

చరణం 26 : దేశ నదులనన్నీ చేసిన అనుసంధానం
ఆశావహంగా కట్టిన వాటర్ షెడ్స్
దిశా నిర్దేశాలతో వాన, వరదల కట్టడి
రాశుల కొద్దీ ఇస్తాయి పంటలు పొలాల్నుండి.
॥చెయ్యాలోయ్॥

మాస్టరు: శభాష్ నీటి గురించి బాగా వివరించారు.
(నమస్కరిస్తూ 1వ బృందం నిష్క్రమణ :)

బి

మాస్టరు: ఇపుడు గాలిని గురించి మరో బృందం వివరిస్తుంది.

2వబృందం

పల్లవి: స్వచ్ఛమైన గాలినే పీల్చుదాం
తుచ్ఛమైన కలుషితాల తుంచుదాం
ముచ్చటగా పరిసరాల నుంచుదాం
పచ్చ పచ్చని చెట్లని పెంచుదాం.

చరణం 27 : పరిసరాలకు జీవరాశులకు నడుమ
చర్య, అధ్యయనమే పర్యావరణం

ధరణి చుట్టూ నెలకొన్నది వాయు మిశ్రమం
మరి ఆ వాయు మిశ్రమం అందిస్తుంది మనకు గాలి.

చరణం 28 : ఈ గాలి ఒక పాంచ భౌతిక శక్తి
ఈ గాలి జీవులకు ప్రాణ వాయువు
ఈ గాలి చెట్లకు తిండిని సమకూర్చు
ఈ గాలి మనుషులకు ఉక్క పోత తీర్చు

॥స్వచ్ఛమైన॥

మాస్టరు: గాలిలో ఏం వుంటాయి?

చరణం 29 : గాలి మిశ్రమంలో తేమ, ఆక్సిజన్
హీలియం, నైట్రోజను, ఓజోన్, మీథేన్
అలా ఇంకా ఉండేను నియాన్, ఆర్గాన్
కాలితే వచ్చేను కార్బన్‌డైయాక్సైడ్.

చరణం 30 : ఊహించలేం గాలి లేని ప్రపంచాన్ని
సాగించలేం గాలి లేక జీవితాన్ని
గ్రహిస్తాం గాలి అత్యవసరమను సత్యాన్ని
గ్రహిస్తాం స్వచ్ఛమైన గాలి ఒక సంపదని.

॥స్వచ్ఛమైన॥

2వబృందం: ఇటువంటి గాలి నేడు రకరకాలుగా కలుషితం అవుతున్నది. ఎలాగంటే-

పల్లవి: కలుషితమౌతోంది గాలి రకరకాలుగా

కలుగుతుందనారోగ్యం దఫదఫాలుగా

చరణం 31 : అగ్ని పర్వతాలు పేలి విడుదలయ్యేటి
భగ్గుమనే సీసం, క్రోమియంల తోటీ -
అగ్గి పడి అడవి మండు వాయువుల వల్ల -
బుగ్గ, ఊబిలోంచి వచ్చు వాయువుల వల్ల

॥కలుషిత॥

చరణం 32 : రకరకాల సూక్ష్మ జీవులూ, శిలీంద్రాలు
యెముకల కళేబరాలపైన మూగు జీవులు
ఒక వంక మానవ ప్రేరిత చర్యల వల్ల
ఒక వంక దుమ్ము, ధూళి, ధూసరాల వల్ల.

॥కలుషిత॥

చరణం 33 : కట్టెలతో, పిడకలతో గ్రామస్థులు వంటింట్లో
వంట చేస్తే వచ్చే పొగలో ఫార్మాల్ డి హైడ్ -
జంటగ వచ్చే వాయువు కార్బన్ మోనాక్సైడ్ -
ఇంటిలోని ధుమ్మూ - గాలి కాలుష్యకాలు.

చరణం 34 : ఇక మన వాహనాల పెట్రోలు ఇంధనం
లేక డీజిలు వదులు వాయువులు సీసం
ప్రక్కన బెంజీను, ఓజోన్, నైట్రోజన్ -
ఆక్సైడ్, హైడ్రోకార్బన్‌లు కలుషితాలు.

చరణం 35 : నగరంలో వున్న పరిశ్రమల నుండి

పొగల రూపంలో నేరుగా గాలిలో

భుగ భుగ వదలు వాయువులు సల్ఫర్ డై ఆక్సైడ్

తగని ఆమ్లాలు, అమ్మోనియా కలుషితాలు.

॥కలుషిత॥

మాస్టరు: గాలి కాలుష్యమైతే దాని ప్రభావం ఏమిటో చెప్పండి?

2వబృందం

చరణం 36 : వంటింటి పొగతో కల్గుతాయి రోగాలు

ఒంటిలోన పాడు చేసి గుండె, శ్వాసకోశాలు

చేరుకొని కార్బన్ మోనాక్సైడ్ మన రక్తంలో

చేటుగా ఆక్సిజన్‌ను తగ్గిస్తుంది.

చరణం 37 : హైడ్రోకార్బన్‌ల వంటి కలుషితాలతో

పుడుతుందిరా ఎథిలీన్ వాయువు.

ఈ వాయువు సోకితే పాడవుతాయి భవనాలు,

ఈ వాయువు సోకితే చూపు తగ్గుతుంది,

కళ్ళు మండుతాయి, కంపే కొడుతుంది.

చరణం 38 : మనుషులతో బాటు క్షీణించురా భవంతులు

నానా ఇబ్బందులు నైట్రోజన్ ఆక్సైడ్‌తో

సీసం ఆక్సైడు వల్ల జీర్ణకోశ వ్యాధులు

సల్ఫర్ డై ఆక్సైడ్‌తో శ్వాసకోశ వ్యాధులు.

॥కలుషిత॥

చరణం 39 : వాతావరణంలో ఉష్ణోగ్రత రెట్టింపు
ఏతా వాతా గాలి కాలుష్యం వల్లనే
నత్రజని ఫ్యాక్టరీల నైట్రస్ ఆక్సైడు
నిత్యం వాడు రిఫ్రిజిరేటర్ ఏరోసాల్
జతగా వాడబడే ఫ్లోరో కార్బన్‌లు
సతతం ఓజోన్ పొరను నాశనం జేస్తాయి.

॥కలుషిత॥

చరణం 40 : నశిస్తే ఓజోన్ పొర మన సూర్యుడి నుండి
అశనిపాతమై అతినీల లోహిత కిరణాలు
దిశతప్పి చేరుతాయి నేరుగా భూమి పైకి
నష్టం కల్గిస్తాయి మన వ్యవసాయానికి.

చరణం 41 : సీసం వల్ల చెప్పలేనన్ని జబ్బులు
తోసుకు వచ్చేను గుండెకాయ వ్యాధులు
కాసులు ఖర్చయ్యే నాడీ మండల వ్యాధులు
మోసుకుపోయే మూత్ర పిండాల వ్యాధులు.

చరణం:42 కురిస్తే ఒక వేళ ఆమ్లవర్షం
భరించని జీవావరణం దెబ్బతింటుంది.
ధరణిన పశువులు, చేపలు, సూక్ష్మజీవులు,
నీరున పెరుగు మొక్కలు దెబ్బతింటాయి. ॥కలుషిత॥

చరణం:43 ఆల్ డి హైడ్సు వలన వస్తాయి తుమ్ములు,

అలసట, ఆయాసం, కళ్ళు, ముక్కులో మంటలు,

గొంతులో మంటలు, దగ్గు, మత్తు కలుగును

అస్బెస్టాస్‌తో అస్బెస్టోసిస్‌న్నూ

బెంజీనుతో కాన్సరు వచ్చును.

కలుగుతుందిరా జంతువులకు కాన్సరు

సీసం వల్ల పిల్లల మెదడుకే డేంజరు.

॥కలుషిత॥

మాస్టరు: ఆ గాలి కాలుష్యాన్ని ఎలా నివారించుకోవాలి? హాయిగా గాలిని ఎలా పీల్చుకోవాలి?

2వబృందం: పొగరాదు వంటకు బయోగాస్ వాడితే పొగరాని పొయ్యిలు మాత్రమే వాడాలిపొగఎక్కువరాని కట్టెలను బాగా ఆ కట్టెలనిచ్చు చెట్లనే పెంచాలి.

చరణం 45: ఉపయోగించాలోయి వంటకు కట్టెబొగ్గును

పంపించాలి బయటకు కార్బన్ మోనాక్సైడును

పంపించాలి బయటకు జాగ్రత్తగా పొగను

కల్పించాలి వంటవాళ్లకు తగిన భద్రతను.

చరణం 46 : మన పబ్లిక్ ట్రాన్స్‌పోర్టు వ్యవస్థను సమూలంగానే

ఘనంగా అధునాతనంగా వృద్ధి పరిచాకనే

దాన్ని ప్రజలకుపయోగించాలి ధర్మంగానే

కనీస వ్యర్థం, ఎక్కువమైలేజీనిస్తుంటేనే

మనకు లాభం అలాంటి వాహనాలు వాడితేనే.

చరణం 47 : ప్రయాణించాలి సీసంలేని పెట్రోలుతో
పయనించేటి ఇంజన్లుగల వాహనాలతో.
నియంత్రించాలి వాహనాల్ని యూరో నాణ్యతతో
ఖాయంగా యూరో-టు ప్రమాణాల అమలుతో

చరణం 48 : తక్కువ హానికరమైన వ్యర్థాలను వెదజల్లు
మిక్కిలి మేలైన ఉత్పత్తి ప్రక్రియలు మేలు
చక్కటి విధానాలను పాటించి పరిశ్రమలు
శుద్ధిచేసి వదలాలి వాయువ్యర్థాల్ని.

చరణం 49 : మనందరం తగ్గించాలి సంపూర్తిగానే
ఇకముందు క్లోరోఫ్లోరో కార్బన్ల వినియోగాన్ని
అన్వేషించాలి -ఇక ప్రత్యామ్నాయ ఇంధనాల్ని
వినియోగించు సంప్రదాయేతర శక్తి వనరుల్ని

చరణం 50 : తక్కువ ఇంధనంతోనే ఎక్కువ పని జరుగు
పెక్కు ప్రక్రియల్ని మనం కనిపెట్టడం మెరుగు
ఇక నేటి వృక్షాలను కాపాడుటలో పెరుగు
ఇక క్రొత్త అడవులు, మొక్కల పెంచుటలో ఎదుగు.

మాస్టరు : వెల్‌డన్ బాయ్స్ (Well done my boys)
(నమస్కరిస్తూ 2వ బృందం నిష్క్రమణ)

మాస్టరు : ఇక ఘన వ్యర్థాల గురించి మరో బృందం మీ ముందుకు వస్తుంది. వాటి నిర్వహణ గురించి వివరిస్తుంది.

3వ బృందం :

పల్లవి : ఘన వ్యర్థాల క్రమనిర్వహణ చేయాలి

పరిసర కాలుష్య నివారణ కావాలి.

చరణం 51&52 : వస్తువు ప్రాథమిక అవసరం తీరాక

వ్యక్తికి ఇక ఉపయోగం కనపడక

శాశ్వతంగా పారేసే వస్తువే వ్యర్థం

కానీ ఇదొక్కటే కాబోదు అర్థం!

ఆర్థిక స్థోమత లోన ఒకరికి వ్యర్థం

వేరొక వ్యక్తికి కావచ్చు ఉపయోగం

అననుకూల ప్రదేశంలో వున్న వస్తువుని

మనం అందుకే చెప్పవచ్చు వ్యర్థమని.

॥ఘనవ్యర్థాల॥

మాస్టరు : అయితే ఆ వ్యర్థాలు ముఖ్యంగా ఘనవ్యర్థాలు ఏవిటి?
వాటివల్ల కలిగే నష్టాలు ఏమిటి ?

3వ బృందం

చరణం 53 : మన యింటిలోని వ్యర్థపదార్థాలు

మన పరిశ్రమలోని వ్యర్థ పదార్థాలు

ఘన వ్యర్థాలు అలా అనేకానేకం

ఘన వ్యర్థాలు పరిసరాలకు అనర్థం.

చరణం 54 : మన ఇంట్లో మిగిలిన ఆహార పదార్థాలు

కూరగాయల వ్యర్థాలు, గుడ్డా, గాజుముక్కలు

మరి ప్లాస్టిక్, కాగితం ముక్కలు, మట్టి గడ్డలు
పరిశీలిస్తే ఇలాంటివేరా ఘనవ్యర్థాలు.

॥ఘనవ్యర్థాలు॥

చరణం 55 : నేటి జీవితంలో ఎక్కువ క్యారీబాగులు
వాటి వాడకం మరిపిస్తోంది బాగోగులు
నేటి మనిషి తయారు చేస్తున్నాడు సగటున
రోజుకు నాలుగు వందల గ్రాముల చెత్తను.

చరణం 56 : చెత్త చుట్టూ ముసురుతాయి ఈగలూ, దోమలూ
సూక్ష్మజీవులు, ఎలుకలూ, కుక్కలూ, పందులూ
కొంత కొంత తేమ చేరి క్రుళ్లటాలు
దానితో చుట్టూన్న వారికి కల్గును జబ్బులు
టైఫాయిడ్, మలేరియా, ప్లేగు, కలరాలు

॥ఘనవ్యర్థాల॥

చరణం 57 : చెత్తను మననగరాల్లో గబగబా వేస్తారు
లోతట్టు ప్రాంతాల్లో విచక్షణ లేకుండ
చెత్త కుళ్లిపోయి దుర్వాయువులు వస్తాయి
చెత్తలో నీళ్లు నేల పొరలలోకి ఇంకుతాయి
మొత్తానికి భూగర్భజలాన్ని కలుషితం చేస్తాయి.

చరణం 58 : రబ్బరు, ప్లాస్టిక్, గాజు పదార్థాలన్నీ
గబ్బు కొట్టు కానీ నశింపవెన్నాళ్లైనా

ఎముకలు, వెంట్రుకలు మొదలైనవన్నీ
అబ్బ మట్టికావటాన్కి పడుతుంది దీర్ఘకాలం.

చరణం 59 : మురుగు వ్యవస్థ నగరాల్లో సరిగా లేదురా
పొరలి పొంగుతున్నవి డ్రైనేజీలు సోదరా
దుర్వాసన పెరిగి ఈగలు, దోమలు వచ్చురా
జోరుగా ప్రజలకు రోగాలను తెచ్చురా.

చరణం 60 : కలుపుతున్నారు నగరాల్లో ఇప్పుడు
వరదనీటి ప్రవాహంలో మురుగు పైపులు
పల్లెల్లో మురుగునీటి వ్యవస్థలేకనే
కలుగుతున్నాయి ప్రజలకు సమస్యలెన్నో

చరణం 61 : పరిశ్రమల్లో వ్యర్థాలు బహుళం-బహుళం
భారలోహాలు - సెలీనియం, సీసం, పాదరసం
మరి విషవ్యర్థాలు పాలీక్లోరినేటెడ్ బైఫినైల్స్
అణుధార్మికత కల్గిన ఆర్సెనిక్ ఎరువులు.

చరణం 62 : వదులుతున్నారు యజమానులు పరిశ్రమ వ్యర్థాలు
యథాతథంగా కలుషిత మయ్యేలా పరిసరాలు
చేరి గాల్లో, నీటిలో, వాతావరణంలో
మరవి కల్గిస్తాయి ప్రజలకు అనారోగ్యాన్ని

చరణాలు

63 & 64: ఆస్పత్రి వ్యర్థాలు వున్నాయి రా అనేకం

డిస్పోజబుల్ పరికరాలు, చీముతో లెనిన్(Linen)

సీసాలు, సిరంజీలు - గాజురకం, ప్లాస్టిక్ రకం

శస్త్రచికిత్సలో తొలగించిన శరీరశకలం

ప్రసవంలో మాయ, గర్భస్రావ వ్యర్థం

సిసలుగా ఇవి సూక్ష్మజీవులతో హానికరం

పీసమెత్తు చింత లేక బహిరంగంగా

ఆస్పత్రులు పారేస్తున్నాయి వ్యర్థాలను

ప్రజా నివాసస్థలాల, వరద, మురుగుకాల్వల

అసంఖ్యాక వ్యాధికారకాలు పెరిగేలా!

॥ఘనవ్యర్థాల॥

చరణం 65 : సదా గృహవ్యర్థాలను కంపోస్టింగ్ చేయాలిరా

సేంద్రియాలను 'వర్మికం' పోస్టింగ్ చేయాలిరా

అంతేకాదు - ప్లాస్టిక్, గాజు, కాగితాల్ని అమ్మాలిరా

సదా అవన్నీ రీసైక్లింగ్‌కు పనికొచ్చునురా

కాదనక చేస్తే గృహ వ్యర్థాలనుండి

ఉత్పత్తి అవుతుంది విద్యుత్తు - మనకు విద్యుత్తు !

చరణం 66 : నగరాలలో విడివిడిగా నిర్వహించాలి

దుర్గంధం తొలగించే మురికి నీటి వ్యవస్థను

వాననీటి, వరదల కొరకు నీటి కాలువలను
పరిశుభ్రత కొరకు మురుగు శుద్ధి కేంద్రంను.

చరణం 67 : ప్రతి గ్రామస్థుడు శౌచాలయాలను వాడాలి
ప్రతి ఇంట్లోనూ స్నానాదులకు వాడు నీటిని
పంపించాలి ఇసుక, గుళకరాళ్లు, పెద్దరాళ్ళ గుంతకు
పంపించాలి క్రొత్త చివుళ్లతో పెరిగే మొక్కలకు.

చరణం 68 : ఆస్పత్రి వ్యర్థాల నుండి వెలువడకుండా కాలుష్యం
ఇన్సినిరేటర్ల వాడుకే ఎంతో అవశ్యం
బెస్టుగా ఆరోగ్యరక్షణే దాని కర్తవ్యం
ఆదిలోనే వ్యాధి నివారణ చికిత్స కన్నా నయం.

చరణం 69 : ఇక పరిశ్రమల్లో తప్పక ఎన్నుకోవాలిరా
తక్కువహాని, తక్కువ కాలుష్యకాలనిచ్చేటి
పెక్కు ఉత్పత్తి క్రియల నన్నింటినిరా.
ఇక కాలుష్యకాలను పూర్తిగ శుద్ధి చేయాలిరా
ఏకంగా ఎఫ్లూయెంట్‌ట్రీట్‌మెంటు ప్లాంట్ల ద్వార
॥ఘనవ్యర్థాల॥

చరణం 70 : కేరీబాగులు మానాలి - గుడ్డ సంచులను వాడాలీ
మరల వాడగల వస్తువులనన్నీ మరల వాడాలీ
ప్లాస్టిక్ వస్తువుల వాడకాన్ని వీలైతే నిషేధించాలి
ఆహారంప్యాకింగ్ ఆకు, కాగితాలతో చేయాలి

సేంద్రియ పదార్ధాన్ని ఎరువు చేసి మొక్కలకేయాలి

వాడిన ప్లాస్టిక్, గాజు, కాగితాల్ని రీ సైక్లింగ్ చేయాలి

పరిశ్రమల వ్యర్థాలను పరిశుద్ధి చేయాలి

ఇంటిలోపలి చెత్తను నిర్ణీతస్థలంలో వేయాలి.

॥ఘనపదార్థాల॥

3వ బృందం : ఇదండీ ఘనవ్యర్థాల నిర్వహణ గురించి సమాచారం

(నమస్కరిస్తూ నిష్క్రమణ).

మాస్టరు : ఇంతవరకూ మీరు నీరు, గాలి, ఘనవ్యర్థాల గురించి విన్నారు. ఇక చెట్లు వాని పరిరక్షణ, విస్తరణ గురించి మా నాలుగవ బృందం మీకు వివరిస్తుంది.

4వ బృందం

పల్లవి : ఉంచాలిరా ఉన్న చెట్లు చేమల్ని

పెంచాలిరా ఇంకా క్రొత్త చెట్లని

పచ్చగా ఉంచాలి పర్యావరణాన్ని

సాధించాలిర ప్రకృతి సమతౌల్యం

అందించాలందరికీ ఆరోగ్యం.

4వ బృందం:

చరణం 71 : చెట్లు మన ప్రగతికే మెట్లురా

చెట్లు త్యాగ నిరతికి బెస్టురా

చెట్లు ప్రాణవాయువునిచ్చురా

చెట్లు జంతుజాలం హితులురా

చరణం 72 : ఆహారోత్పత్తి జరుపుకునే చెట్లు గాలి నుండి

స్వాహా చేసేను బొగ్గుపులుసు వాయువు నంతనూ

ఓహో! ఫోటోసింథసిస్ ప్రక్రియలోన బాగా

ఆహ! సరిపడా ఆక్సిజన్ను విడుదలచేయు చెట్లు

చరణం 73 : చిన్న చిన్న క్రిములు, పెద్ద పెద్ద జంతువులు

మానవులు - ఆక్సిజను పీల్చు జీవులురా

మనలేవు ఆక్సిజను లేక జీవాలురా

చెట్లేరా ఆక్సిజను అందించు వనరులు

మాస్టరు : మరి చెట్లు ఇంకా మనకెలా ఉపయోగం? అవి లేకపోతే కల్గే కష్టాలు చెప్పండి

చరణం 74 : పెనుగాలి, ఘనవర్షం, పేట్రేగే ఎండల

కల్లోల స్థితుల నుండీ చెట్లు కాపాడును.

అలల్ని, తుఫానుల్ని, వరదల్ని అడ్డుకోని -

ఇల నివాసాలకు రక్షణనిచ్చేది చెట్లు.

చరణం 75 : పెద్ద పెద్దగా వర్షాలు పడ్డపుడు ఎంతో

పెద్ద ఎత్తునుండి పడు నీటి వత్తిడి నెంతో

పెద్దగ తగ్గించి పై మట్టి కొట్టుకు పోకుండ

శ్రద్ధగ మన భూమిని కాపాడేవే చెట్లురా.

చరణం 76 : మనిషి కవసరం సకాల వర్షం

జల చక్రం కల్గుటకు చెట్లు ముఖ్యం

ప్రతి కొమ్మా, రెమ్మా పీల్చే జలాన్ని

సతతం వేళ్ళద్వారా ఈ చెట్లురా

భూమి పొరల్లోకి ఇంకించుతాయిర

చరణం 77 : తమ భాగాలకు చెట్లు నీరందించేందుకు

నేల పొరల నుండి నీటిని గ్రహిస్తాయిరా

తాము మరల బాష్పీకరణ, ఆవిరిద్వారా

నీటిని వాతావరణంలోకి పంపుతాయి ॥ఉంచాలిరా॥

నాల్గవ బృందం : అలా వర్షాలు పడినపుడు చెట్లు నీటిని బాగా గ్రహించి భూమిలోకి ఇంకింవజేసి ఒక జలాశయాన్ని రూపొందించి మళ్ళీదాన్ని వాతావరణంలోకి పంపి జల చక్రంలో గణనీయమైన పాత్రను పోషిస్తున్నాయి.

ఇంకా -

చరణం 78 : మన చెట్ల ఆకులూ, కొమ్మలూ తగ్గిస్తాయి

వానల వేగాన్ని, వత్తిడిని, గాలిస్థాయిని.

మన భూమిలో చెట్ల, మొక్కల వేళ్లు - నేలని

ఘనంగా గట్టిగా పట్టి బంధిస్తాయి

మన చెట్లలా నేలకోతను అరికడతాయి.

॥ఉంచాలిరా॥

చరణం 79 : చెట్ల యొక్క ఆకులూ, బెరడుల చెంత
చేరి జీవించేటి చిన్ని జీవాలు
పుట్టి, చనిపోయి గట్టిగా రొచ్చుగ మారి
మట్టిని సారవంతం చేస్తాయిరా.

చరణం 80 :అన్ని నేలల అభివృద్ధికి తోడ్పడే
కొన్ని రకాల సూక్ష్మజీవులకు -
ఈ నేల పొరలు ఆవాసంరా
ఆ నేలలు మంచి పోషకాలను
అనేకం ఉత్పత్తి చేయునురా ॥ఉంచాలిరా॥

చరణం 81 : చెట్లు బొగ్గుపులుసువాయువును పీల్చుకుని
అట్లు నియంత్రించునురా ఉష్ణోగ్రతని
చెట్లిచ్చును పూలు, పండ్లు, కూరగాయలు
చెట్లిస్తాయి కలప, మందులు, వంటచెరకుని

చరణం 82 : పక్షులకు గూడు, పశువులకు మేతను
ప్రజావళికి నీడ, ఆహారాలను,
కాగితాల పరిశ్రమకు ముడిసరుకును
ఘనంగా అందించే త్యాగధనులు
ఎన్నగ అవేరా మన వృక్షాలురా ॥ఉంచాలిరా॥

చరణం 83 : మొక్కలు నాటాలి మనం మొక్కలు నాటాలి
చక్కగా ఇళ్లలో, క్షీణించిన అడవుల్లో

పల్లెటూర్లలోన మరి పట్టణాలలో
కర్మాగారాల్లో, కార్యాలయాల్లో
వాగు, వంక, తీరాలు, పొలాలగట్లపై
దారులకు ఇరుప్రక్క నేలల్లోపలా
తిన్నగ రైలుదారి కిరువైపుల్లోనా
ఆస్పత్రుల్లో, విద్యాలయాల్లోనూ
మొక్కలు నాటాలి మనం మొక్కలు నాటాలి
మొక్కలు నాటాలి మనం మొక్కలు నాటాలి

నాల్గవబృందం- ఇంతటిలో చెట్లు, వాటి పరిరక్షణ, విస్తరణ గురించి
వివరణను ముగిస్తున్నాం - నమస్కరిస్తారు)

అంతలో -

మాస్టరు, 1వ, 2వ, 3వ బృందాలు వచ్చి 4వ బృందంతో కలిసి అందరూ

ఎ నీరే కావాలి రక్షితనీరే కావాలి
పారే వర్షపు నీరు పొలాలకు మళ్లాలి
నరజాతి కంతటికి ఆరోగ్యం కలగాలి
తరతరాలకు సరిపడే పంటలు పండాలి.

బి - స్వచ్ఛమైన గాలినే పీల్చుదాం
తుచ్ఛమైన కలుషితాల తుంచుదాం
ముచ్చటగా పరిసరాల నుంచుదాం
పచ్చ పచ్చని చెట్లని పెంచుదాం

సి - ఘనవ్యర్థాల క్రమనిర్వహణ చేయాలి

పరిసర కాలుష్యనివారణ కావాలి

డి - ఉంచాలిరా ఉన్న చెట్టు చేమల్ని

పెంచాలిరా ఇంకా క్రొత్త చెట్లని

పచ్చగ ఉంచాలి పర్యావరణాన్ని

సాధించాలిర ప్రకృతి సమతౌల్యం

అందించాలందరికీ ఆరోగ్యం -

పాడుతూ - నమస్కరిస్తూ అందరూ నిష్క్రమణ నేపథ్యంలో....

తిరిగి 'నవజీవనం' - గేయం

# మనకొద్దు సారా

-డా॥ నాగినేని భాస్కరరావు,

సురాపానము మానవుడు అభివృద్ధి చెందిన తరువాత అనేక శతాబ్దములనుండి సమాజంలో వేలువేలు కారణములచేత అంగీకరింపబడినది. పురాణములలో చెప్పినట్లు దేవతలు (కల్పితము) రాక్షసులనుండి లాక్కొని మాయోపాయంగా త్రాగినది సురయేనని మనం అర్థం చేసుకొనవచ్చును. ఒకసారి సురాపానమునకు బానిసలైన వారు దానికోసం ఎలా తాపత్రయపడి పలురకాల అవస్థలకు గురియౌతారో దేవదానవుల యుద్ధాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చును. ఈ సురయే రూపాంతరము చెంది 'సారా' గా మారి నేడు సమాజంలో ఒక మహామ్మారిగా మారి సమాజం యొక్క అభివృద్ధికి అవరోధమగుచున్నది. బడుగు వర్గాలవారు, మధ్యతరగతి వారు సారాకు అలవాటుపడి సంసారాలను సర్వనాశనం చేసుకుంటున్న తరుణంలో నేడు ప్రజలు కొందఱు ముఖ్యంగా స్త్రీలోకం సారావ్యతిరేక ఉద్యమానికి పూనుకోవటం ముదావహం ఇట్టి సమయంలో సారా యొక్క మంచి చెడ్డలను, సారాయి మరియు దాని అనుబంధ ద్రవాలు వాడితే వచ్చే చెడ్డ ఫలితాలు తెలియజేసేందుకు ఉద్దేశించినదే యీ వ్యాసం

'సారా' అంటే - సారాయి (ఆల్కహాల్ – Alcohol) ఒక రంగులేని, అవిరయ్యే స్వభావంగల ఘాటైన ద్రవపదార్థము. $C_2H_5OH$ దీని నిర్మాణము మరియు రసాయనిక కూర్పు అనేక శతాబ్దములనుండి సారాని బాధానివారణకు, ఉద్రిక్తత నివారణకు, మానసిక ఉల్లాసానికి వాడుతున్నారు. సాధారణంగా ఒక వ్యక్తి 24గం॥లలో రెండు ఔన్సుల స్వచ్ఛమైన సారాయిని జీర్ణించుకోగల్గుతాడు. రక్తంలో సారాయి 0.2 శాతమునకు మించి యున్నచో మత్తు (Intoxicaition) కల్గుతుంది. దీనిని ఇంధనముగా (Fuel) మండించవచ్చును. పరిశ్రమల్లో, వైద్యంలో దీనిని ఉపయోగిస్తారు. దీనినే ఇథైల్ ఆల్కహాల్ (Ethylalcohol)

అనికూడ అంటారు. విస్కీ, బీరు, బ్రాంది, వైన్, రమ్, జిన్ మొ॥లగు ద్రవాలలో యిమిడియుండి మత్తును కల్గించే మూల పదార్ధము యీ ఆల్కహాలే. నేడు ప్రతి వందమందికి ఒకరు లేక ఇద్దరు సారాయిని సేవిస్తున్నారు మనదేశంలో.

సారాయి ఉపశమనకారి (Sedative), ఊహల్లో ముంచేదిగా, భావాల్లో ఉంచేదిగాను (Tranquilizer), మత్తు (Anaesthetic) కల్గించేదిగా తీసుకునే మోతాదును బట్టి పనిచేస్తుంది అన్ని రకాల మత్తు మందుల్లో ఆల్కహాల్‌ను ఎక్కువగా జనం తీసుకోవడంవల్ల సమాజంలో సారాయి సేవనం కొంతవరకు అంగీకరింపబడింది. సారాయిని సేవించటం కొన్ని చోట్ల ఒక సామాజిక అలవాటు. అయితే ఒక వ్యక్తిని "త్రాగుబోతు" గా ఎప్పుడు పరిగణిస్తామంటే ఆ త్రాగుడు అతని మానసిక మరియు శారీరక ఆరోగ్యములనేకాక వ్యక్తిగత సంబంధాలను, సామాజిక సంబంధాలను విధ్వంసం చేసినప్పుడే.

సారాయి లేక బ్రాంది మొదలగు మత్తు ద్రవాలు సేవించే సందర్భాలు-

1. పండుగలకు. 2. ఇంట్లో ఏమైనా శుభకార్యం జరిగితే.

3. అతిథి వస్తే. 4. ఉద్యోగులకు ప్రమోషన్ లేక ఎరియర్స్ వస్తే.

5. పిల్లో, పిల్లగాడో పుడితే. 6. డబ్బులు ఎక్కువై సరదా కోసం.

7. కొన్ని ప్రాంతాల్లో ఆడ, మగ, చిన్న పెద్ద తేడా లేకుండా త్రాగే ఆచారం.

8. కాన్పు కష్టమైతే కొందరు స్త్రీకి సారాయి యిస్తారు.

9. బలం రావాలని, చలువ చేస్తుందని కొందరు.

10. పెద్ద ఉద్యోగికి చిన్న ఉద్యోగి, పై అధికారికి క్రింది అధికారి చేసే మర్యాద సందర్భంగా.

11. సంవత్సరం మొదటిరోజున. 12. ఎలా ఉంటుందో చూద్దాం అనే ఉత్సాహం. 13. శరీరంలోని బాధలకు తట్టుకోలేమని కొందరు.

14. పగలల్లా పనిచేసి రాత్రులు వళ్లు నొప్పులు మర్చిపోవటానికి కొందరు. 15. తమ పనులవలగానే కంట్రాక్టర్లు, ఇంజనీర్లకు, తదితర

సిబ్బందికి చేసే మధుసేవ.16. అనేక ప్రభుత్వ శాఖల్లో ఫైలు కదలడానికి, కదలి కోరిన పని కావటానికి.17. పరీక్షలు పాసైతే.
18. ఇంట్లో భార్యతో గొడవపడ్డప్పుడు.19. హత్యలకు యితర కోట్లాటలకు వెళ్లేముందు.20. కొలుపులు, బలులు యిచ్చేముందు.
21. ఎలక్షన్లలో కొందరు రాజకీయ నాయకులు ప్రోత్సహించి త్రాగమన్నప్పుడు.22. ఆకలికోసం వ్రాసే ప్రతి టానిక్కులో సారాయి ఉన్నప్పుడు. 23. అలవాటు వ్యసనంగా మారినపుడు ప్రతిరోజూ త్రాగటం. 24. సారాయి, బ్రాందీ త్రాగటం ఒక నాగరికచర్య అని అనుకొన్నప్పుడు. 25. తోటి మనిషి మరణించినపుడు. 26. ఆకలి పుట్టిస్తుందని. 27. స్వర్గ సుఖాలలో త్రాగుడు ఒక పనిగా. 28. కొన్ని ప్రాంతాల్లో శీతోష్ణ పరిస్థితులను బట్టి. 29. సైన్యంలో. 30. శృంగారంలో.
31. ఒక టేమిటి - సంతోషంలో, దు:ఖంలో-

**అంతేకాక మరికొన్ని కారణాలు :** (Aetiology) పూర్తిగా అర్థంకానిది.

1. సారాయిసేవనం కొన్ని సాంఘిక మరియు సంస్కృతుల్లో ఉంది.
2. కొన్ని వృత్తులలోని వారు సారాయి సేవనానికి గురౌతారు. ఉదా: లైసెన్సుల వ్యాపారం, వ్యాపారనిమిత్తం ప్రయాణాలు, సారాయి అమ్మకందారులు బార్ షాపుల్లో పనిచేసే ఉద్యోగులు, రౌడీ మూకలు.
3. స్త్రీలకంటే పురుషులెక్కువగా సారాయి సేవిస్తారు.
4. సామాజిక స్పృహ తక్కువగానున్నవారు, సమాజంలో కలవనివారు ఎక్కువగా త్రాగే అవకాశం ఉంది.
5. మానసిక బలహీనతలు (Psychopathy, Schizophenia, Hypomania or Depression) కలవారిలో సారాయి సేవనం ఎక్కువ.
6. ఆనందానికి.
7. ప్రయోగపూర్వకంగా త్రాగాలనే కోరిక సాహసం చేస్తున్నామనే భావన,, సమస్యలనుండి తప్పించుకోటానికి.
8. జీవితంలో కొద్దిపాటి కష్టాన్ని కూడా ప్రజలు సహించలేక సారాయిని

లేక యితర పదార్థాల వాడకానికి సిద్ధపడుట.

**తాగుడుకు అలవాటయ్యే పరిసర కారణాలు :**

1. త్వరితగతిని సంభవిస్తున్న సాంకేతిక విధానాలు, వాటితో సంబంధించిన దీర్ఘకాలిక విద్యా కాలాలు, కాలం చెల్లిన విధానాలు నేటి సమస్యలకు పరిష్కారం చూక పోవటం మొ॥నవి.

2. దూరదర్శిని, ప్రపంచపర్యటనలు, ధనము, స్వేచ్ఛ మొ॥నవి. నేటి తరం వారి తల్లి తండ్రుల జీవిత నైతిక విలువల్ని ప్రక్కకు త్రోసివేసేందుకు దారి తీసి, మద్యపానానికి చేరువగుటకు కారణమౌతున్నాయి.

3. సాంప్రదాయిక విలువల్ని కాలానుగుణంకావని త్రోసివేస్తూ వదిలేస్తూ ఉండటం.

4. నిజమైన మనిషీ, మానవత్వం మానవుని అంతిమధ్యేయం మొ॥నవి. బయటకు రావాలంటే 'సారా' లేక 'బ్రాందీ' తదితర మర్యాదలు అవసరమని కొందరు భావిస్తున్నారు. పరిశోధనలు ఏమితేల్చాయంటే -- వీటికి అలవాటు పడ్డవాళ్లు ఎక్కువగా అరాచక, రౌడీమూకల్లోను, నేర ప్రవృత్తి ఎక్కువగా ఉన్నవారని.

**ఆల్కహాల్ రకాలు :** 1. స్వచ్ఛమైన ఆల్కహాల్ : ఈ ఆల్కహాలును చక్కెర పరిశ్రమల్లో End Product - చివరగా మిగిలే 'మొలాసిస్' నుండి తయారు చేస్తారు. ఇది అనేక రకాలుగా మనకు ఉపయోగపడుతుంది -- పరిశ్రమల్లో, వైద్యంలో. ప్రభుత్వం సరఫరా చేసే సారాయి యిదే.

2. కాపుసారా లేక ఇప్పసారా - అనేక ప్రాంతాల్లో ప్రభుత్వసారాకు ప్రత్యామ్నాయంగా ప్రజలు కొందరు బెల్లం, విప్పపువ్వు, బ్యాటరీ లలోని కొంత నిరుపయోగ భాగం, మరి అనేక యితర పదార్థాలతో, ఆరోగ్యానికి హానికల్గించే పదార్థాలను కూడా కలిపి కాపుసారా తయారు చేస్తారు. దీనిని త్రాగుటవలన అనేక మంది అనారోగ్యానికి గురికావటమో, మరణించటమో జరుగుతున్నది.

3. బీరు (Beer) -- బార్లీ ధాన్యమునుండి మరి కొన్ని సుగంధ ద్రవ్యాలను కలిపి పులియ పెట్టటం (Fermentation & Destination) ద్వారా లభించేసారాయి ద్రవమే బీరు. దీనిని అనేక వేళ్లు మరియు మొక్కల సారమునుండి కూడా తయారు చేయవచ్చును. ఉదా:- జింజర్ బీరు, ఈ బీరు అన్ని బ్రాందీ షాపులలో లభిస్తుంది. మధ్యతరగతి వాళ్లు సారాయి సేవనం ప్రారంభదశలో నున్నవారు దీని నెక్కువగా సేవిస్తారు.

4. బ్రాందీ (Brandy) : చెర్రిఫలాల రసమును బట్టీయం పెట్టుట ద్వారా లభించే సారాయి ద్రవమును బ్రాందీ అందురు. వైన్ నుండి కూడా దీన్ని తయారు చేయవచ్చు.

5. వైన్ (Wine) : ద్రాక్ష పండ్లరసమును పులియ పెట్టటంద్వారా లభించే సారాయి ద్రవమును వైన్ అందురు. దీని రంగు ఎఱ్ఱగాను, తెల్లగాను, గులాబిరంగుగాను తయారు చేసుకొనవచ్చును. అట్లే తీపికలదిగా, లేనిదిగా, నురుగువచ్చునదిగా రానిదిగా తయారు చేసుకొనవచ్చును. స్వచ్ఛమైన ఆల్కహాల్‌ను కలిపికొని మరింత శక్తివంతముగా (Fortified) మార్చుకొనవచ్చును.

6. రమ్ (Rum) - మొలాసిస్ మరియు చెరుకు నుండి పులియ (Fermentation) పెట్టుట ద్వారా లభించే సారాయి ద్రవమును రమ్ అందురు.

7. జిన్ (Gin) : రై (Rye) మరియు యితర ధాన్యములనుండి (Distillation) బట్టీయం పట్టబడిన ఘాటైన మరియు శక్తి వంతమైన సారాయి ద్రావకమును జిన్ అందురు. Juniper Berries జునిపర్ బెర్రీస్ పండ్లను సువాసన కోసం దీని తయారీలో ఉపయోగిస్తారు.

8. విస్కీ (Whisky) - పులియబెట్టబడిన ధాన్యము, గోధుమ, బార్లీ పదార్థమును బట్టీయంపెట్టుట ద్వారా లభించు సారాయం ద్రవమే విస్కీ.

**ఆల్కహాల్ త్రాగితే ఏమవుతుంది ?** ఆల్కహాలును త్రాగిన రెండు మూడు నిముషాలలోనే అది మనకడుపులో నుండి ప్రేవులలోనుండి రక్తంలోనికి పీల్చబడుతుంది. త్రాగిన ఒకగంటకల్లా రక్తంలో సారాయి త్రాగినట్లుగా మనకు నిర్ధారణ అవుతుంది. మనం తీనుకున్న ఆహారం వల్ల కడుపులోనికి ప్రవేశించిన సారాయి ఆహారం వల్ల కొంత పలచనయిన కారణంగా కొంతవరకు రక్తంలోకి పీల్చ బడకుండా ఆపబడుతుంది.

**ఆల్కహాల్ పనివిధానము :** మన కేంద్ర నాడీమండలం (Central Nervous System) పై ఆల్కహాల్ పనిచేస్తుంది. అనేక మంది చాలాకాలం భావించినట్లుగా సారాయి " ఉత్తేజకారిణి" (Stimulant) గా పనిచేయదు. అంతేగాక నాడీమండలమును నిరంతరంగా నిస్తేజపరుస్తుంది (Depressant). కొద్దిమంది తీవ్రస్థాయిలో మానసిక బానిసత్వాన్ని (Dependance) ఆల్కహాల్ కల్గిస్తుంది. శారీరక బానిసత్వాన్ని క్రమేనా పెంపుదలచేస్తుంది.

నేటి ఆలోచనల్లో సారా త్రాగుడు కూడా ఒక జబ్బుగాను, సారాయిని జబ్బుకల్గించే కారకము (Agent) గాను పరిగణింపబడుతున్నది.

**అతి త్రాగుడు వలన కలిగే వ్యాధులు మరియు సామాజిక హాని :** అతిగా సారా త్రాగటంవల్ల తరుణ (Acute) మరియు దీర్ఘకాలిక (Chronic) మత్తు, కాలేయం జబ్బు, విషమించిన మానసిక స్థితి, కడుపు మంట, వృక్వకము(Pancreas) వాచుట, గుండెజబ్బు మరియు పరినర నాడీమండలము క్షీణించుట మొదలగు జబ్బులు సంక్రమిస్తాయి. అంతేకాక నోరు, గొంతు, స్వరసేటిక, అన్నవాహికలు కాన్సరుకు గురియయ్యే ప్రమాదమున్నది. అంతేకాక హింసాకాండలతో హత్యలతో, గాయాలతో ఆత్మహత్యలతో, రోడ్డు ప్రమాదాలతో మరియు యితర సామాజిక అఘాయిత్యాలతో, స్త్రీలపై అత్యాచారాలతో, సారాయికి ప్రముఖపాత్ర యుంటున్నది.

సారాయిని త్రాగటంవలన వచ్చే అనారోగ్యము మొత్తం

సమాజానికి నష్టంకల్గించటమే గాక అందులో భాగాలయిన కుటుంబాల అస్తవ్యవస్తకు, నేరములకు, దేశంలో వ్యవసాయరంగంలో, కర్మాగారాలలో ఉత్పత్తి స్థాయి పడిపోవుటకు కారణమగుచున్నది.

**శారీరక రోగలక్షణాలు :** అతి త్రాగుడులో దశల వారీగా శారీరక రోగలక్షణాలు వృద్ధి చెందుతాయి. ఎక్కువసార్లు త్రాగటం, ఎక్కువగా త్రాగటం, త్రాగలేకుండా ఉండటం, మొ॥నవి సంభవిస్తాయి. జ్ఞాపకశక్తి, ఏకాగ్రత దెబ్బ తింటాయి - తక్కువౌతాయి. భావోద్రేకత కల్గి మధ్య మధ్యలో దు:ఖించటం, విచారించటం సంభవిస్తాయి. కుటుంబ సభ్యులపట్ల చూపవలసిన అనురాగం, ప్రేమ, మొక్కపోతాయి.

ముఖ్యమైన విధులను క్రమంగా విస్మరించటం జరుగుతోంది. వ్యక్తి గత స్వార్థం, క్రూరత్వం పెరుగుతాయి. సాధారణంగా 40 లేక 50 సంవత్సరాల వయస్సులో చెడుఫలితాలు ఎక్కువౌతాయి. శారీరకం మార్పులు వస్తాయి. ముఖం, శరీరం వణుకుడు, నరాల బలహీనత, పెరిగిన కాలేయము. జీర్ణకోశం మరియు శ్వాసకోశం పాడగుట మొ॥నవి సంభవిస్తాయి. ఆల్కహాలును ఎక్కువ తీసుకొనుటవలన యీ క్రింది ప్రత్యేక పరిస్థితులను గుర్తించటం జరిగింది.

1. తరుణ మధుపానం మత్తుస్థితి : - (Acute Alcoholic Psychosis or Pathological Drunkenness) : - ఇది సాధారణంగా సారా త్రాగినతర్వాత వచ్చే కొద్దికాలం ఉంటే ఉద్రేకపరిస్థితి. కంగారు ప్రవర్తన మరియు అనుచిత ప్రవర్తనకు దారి తీస్తుంది. శరీరం వణకుట, మానసిక వికలత ఉంటాయి.

2. Dipsomania (డిప్సోమేనియా) : - సారాయి కోసం తీవ్రంగా తపించటం దీని లక్షణం. విపరీతంగా త్రాగిన తర్వాత కొద్దిగా త్రాగటంగాని, లేక అసలు త్రాగకుండా ఉండటం గానీ జరుగుతుంది. మానసికంగా క్రుంగిపోవటమేగాక దాదావు మూర్ఛరోగివలె పడియుండటం జరుగుతుంది.

3. Delirium Tremens (చిత్తభ్రమణకంపనము) : - దీర్ఘకాలంగా అతి త్రాగుడుకు అలవాటు పడ్డ వారిలో ఇది కన్పిస్తుంది. ప్రమాదాలు, జ్వరం మొ॥నవి జరుగవచ్చు. నిద్రలేక పోవటం, చికాకు పడుట, ఆకలి లేకుండుట, ఆహారాన్ని వద్దనుట, నీరసం, శరీరం వణకుట, క్రమంలేని కదలికలు మరియు అపస్మారస్థితికూడా కలుగవచ్చును. భయం, సంకోచం, భయ భ్రాంతిని కల్గించే దృష్టి, వినికిడి వికారాలు, ఎక్కడున్నాడో తెలియక పోవటం, సమయ సందర్భాలు తెలియకపోవటం, వస్తువులను గుర్తు పట్టకపోవటం, చిన్న చిన్న ఆజ్ఞలను కూడా నెరవేర్చకపోవటం, ఇటీవల జరిగిన విషయాలుకూడా మర్చిపోవటం, పలాయన తత్వం, హత్య, ఆత్మహత్యవైపు మొగ్గడం మొదలగునవి సంభవిస్తాయి.

4.Alcoholic Paranoia (మధు సేవనావిభ్రాంతి) :- దీర్ఘకాలంగా సారా త్రాగుచున్న వారికి ఇదివస్తుంది. లైంగిక క్రియలో వీరికి సామర్థ్యం తగ్గడమే కాకుండా తమ అర్ధాంగి ప్రవర్తన పై అనుమానం పెంచుకుంటారు.

5. Hallucinatory State (చిత్తవికారభ్రాంతి స్థితి : - ఊహాలోకంలో ఉన్నట్లు, ధ్వనులు విన్పిస్తున్నట్లు వుంటుంది. సామాజిక నిర్ణయాలు తీసుకోగల శక్తి వుంటుంది.

6. Dementia (మతి మరుపు) : క్రమేణా మతిమరుపు వస్తుంది. వణుకుడు అర్థంపర్థం లేని మాటలు. ఊహాజగత్తులో వుండటం (Amnesia), దీని లక్షణాలు.

7. Wernicke's Syndrome ( వెర్నిక్స్ సింద్రోమ్) : దీర్ఘ కాలంగా త్రాగుడు మాత్రమే చేస్తూ సరిగా ఆహారం తీసుకొనని వారిలో యిది వస్తుంది. విటమినుల లోపం వలన వస్తుంది. సరిగ్గా నడవలేక పోవటం, స్పృహ సరిగా లేకపోవటం, కంటినొప్పి, ఆందోళన, వస్తువులు రెండుగా కన్పించటం మొ॥నవి దీని లక్షణాలు.

8. Korsakow's Syndrome : (కోర్సాకోవ్స్ సిండ్రోమ్) : ఈ లక్షణం ఎక్కువగా దీర్ఘకాలంగా బాగా సారా త్రాగే ఆడవారిలో వస్తుంది. కాళ్లు చేతుల నరాల బలహీనత (Peripheralneuritis) మోకాళ్లు క్రింద కండరాలు నొప్పి, కండరాలు చచ్చుపడుట. Tendon reflexes లేకుండుట, చిక్కిపోవుట Calf -Muscles యీ సిండ్రోమ్ యొక్క లక్షణాలు. మెదడులో యిటీవల జరిగిన సంఘటనలు రిజిష్టరయి వాటిని పదిలపరచుకొనే శక్తి పోవుటవలన కలిగే మతిమరుపు, స్థలకాలముల విచక్షణ లేకుండుట, ఉద్రేకము చెందుట, దృష్టికి సంబంధించిన ఊహాలోకవిహారము, వ్యక్తులను గుర్తు పట్టలేకుండుట మొ॥నవి యితర లక్షణాలు.

ముఖ్యంగా అతి త్రాగుడువలన కాలేయమునకు సంబంధించిన (Acute Alcoholic Hepatitis) కాలేయము వాచుట అనే జబ్బు వస్తుంది. అధికంగా త్రాగుతూ ఆహారం తీనుకొనక పోయినట్లయితే కాలేయమునందలి జీవకణములు నశించి కామెర్ల జబ్బుకు గురి చేస్తుంది. వాంతులు, కడుపు కుడివైపు నొప్పి కల్గుతాయి. రెండు వారాల పాటు తీవ్రంగా జ్వరం వస్తుంది. కామెర్లు ముదిరితే మానసిక స్థితి క్షీణంచి 'కాలేయ అపస్మారక స్థితి' లోనికి వెళ్తాడు. ప్రేవుల్లో కూడా మార్పులు వచ్చి కడుపులో, ప్రేవుల్లో రక్తస్రావం జరుగుతుంది. కాలేయం వాచిపోతుంది. ఆల్కహాలిక్ సిర్‌హోసిస్ - ALCOHOLIC CIRRHOSIS కు దారి తీస్తుంది. ఉదరంలో నీరు చేరి కాళ్లు కూడా వాచిపోతాయి. చివరకు మరణానికి దారితీస్తుంది. కాలేయంలో క్రొవ్వు చేరుకొని చివరకు పైన చెప్పిన కాలేయపు వాపుకు CIRRHOSIS దారి తీస్తుంది.

**చికిత్స:** సారాత్రాగుబోతు చికిత్సకు వస్తే తప్ప అది సాధ్యం కాదు. సారాయి లేకుండా జీవించగలననే నిర్ణయానికి అతడు రావాలి. కానీ

దురదృష్టవశాత్తు త్రాగుబోతులందరు చికిత్సతీసుకునే ఆలోచనే చేయరు. త్రాగుబోతులు తాము ఎక్కువగా త్రాగటం లేదంటారు. అంతేగాక తమను తాము సమర్థించుకుంటారు. దీర్ఘకాలంగా సాగే యీ చికిత్స ఒక వైద్య సమస్యయే గాదు. మానసిక వ్యాధుల వైద్యుల మరియు సమాజవాదుల సహకారంకూడా కావాలి. త్రాగినపుడు చికిత్స తీసుకున్నా తిరిగి చాలా మంది త్రాగుతునే యుంటారు.

సాధారణంగా త్రాగుబోతు భార్యయో కొడుకులో యితర దగ్గర బంధువులో చికిత్సకు తీసుకొని వస్తారు. వైద్యశాలలో జరిపే చికిత్సతోపాటు ఆ తరువాత వారిని ఆకుటుంబ సభ్యులు జాగ్రత్తగా గమనిస్తూ విటమిన్లు మాంసకృత్తులు, క్రొవ్వు పదార్థాలతో కూడిన ఆహారమును యిచ్చినట్లయితే త్వరగా కోలుకుంటారు. సారాయిని వారికి అందుబాటులోనికి రాకుండా జాగ్రత్త పడాలి.

**నివారణ** : 1. ప్రజలు సారాయి త్రాగటాన్ని యిక ముందైనా ఆపుచేసేందుకు తగిన అత్యధిక ప్రాధాన్యత నివ్వాలి.

2. ప్రజలకు సారాయి మరియు యితర మత్తు పదార్థాల చెడును గురించి విస్తృతంగా బోధించాలి. ముఖ్యంగా టీ.వి లలో సినిమాలలో సారా త్రాగుడు యొక్క శారీరక, కుటుంబ, సామాజిక, చెడులను గురించి చెప్పాలి.

3. మానవసంబంధమైన సమస్యలకు మందులు వాడే (మత్తు పదార్థములు) విధానాన్ని ఖండించాలి.

4. త్రాగుబోతుగా ముద్రవడి త్రాగుడు మాని వేసిన వానికి బంధువులుగాని, ప్రభుత్వంగాని ఉపాధి గల్పించాలి. మత్తు పదార్థములు సేవించకుండా తాను బ్రతుకగలనను విశ్వాసాన్ని కల్గించాలి. అతను మరల మామూలు సామాజిక జీవన సరళిలోనికి రావాలి.

5. సారాయి మరియు యితర మత్తు పదార్థాలను అమ్మకుండా ప్రభుత్వము ఏదైనా గట్టి చట్టబద్ధమైన చర్యతీసుకోవాలి.

**ఉపసంహారము:** నేడు దేశంలో - ఆంధ్రప్రదేశ్‌లో ప్రజలు సారా వ్యతిరేక ఉద్యమాన్ని నడుపుతున్న స్త్రీ,పురుష కార్యకర్తలందరికి యీ దిగువనుదహరించిన ముఖ్యాంశాలను దృష్టికి తెస్తూ యీ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

1. సారాయి నిత్యజీవితావసర వస్తువు కాదు.

2. పాలకుల్లో అధికారుల్లో ఎక్కువ త్రాగుబోతులున్న యీ ప్రభుత్వం ఎక్సైజ్ సుంకము ద్వారా వచ్చే ఆదాయాన్ని కూర్చుకోవటానికి ప్రత్యామ్నాయ మార్గాలను ఎంచుకొని అన్ని ప్రభుత్వసారాదుకాణాలను మూసివేసి సారా నిషేధ చట్టాన్ని తక్షణమే అమలు లోనికి తేవాలి.

3. జార, చోర, రుజా(రోగం) గ్రస్తం చేసే 'సారా'ను ప్రజలంతా స్వచ్ఛందంగా విడనాడి సమైక్య సంతోష కుటుంబ వ్యవస్థకు తిరిగివచ్చి వ్యవసాయ, కర్మాగార, శాస్త్ర పరిశోధనా రంగాలలో అభివృద్ధి సాధించి దేశాన్ని ముందుకు తీసుకెళ్లాలి.

4. సారాయిని అవసరమైన పరిశ్రమలకు, వైద్య రంగానికి పరిమితం చేయాలి.

**5. సారాయిని మానాలి సంపన్నులు కావాలి.**

## సారా త్రాగవద్దురా!

– డా॥ నాగినేని భాస్కరరావు

పల్లవి : వద్దు, వద్దు, వద్దురా! సారా త్రాగవద్దురా!
వద్దు వద్దు వద్దు నీవు తంటా పడవద్దురా!!
సారా త్రాగినీవు చావును కొని తెచ్చుకోకు!

చరణం : రోజంతా కార్ఖానలపని జేసిన శ్రామికుడా
పగలంతా పొలాల్లో కష్టించిన కూలోడా
వచ్చిన నాలుగు డబ్బులు దారిలోని కొట్టుకాడ
సర్కారు ప్రసాదముని సారాకు తగలేయకు!

॥వద్దు॥

చరణం : నెల్లాళ్లూ ఓ బ్రదరూ! ఆఫీసులకెళ్లొచ్చి
నెల్లాళ్లూ ఓ ఫాదర్! కొట్లో లెఖ్ఖలు వ్రాసి
జీతాలొచ్చిన రోజున రయ్యమని రాజులాగ
బారులోన బ్రాందీకి బానిసవైపోకురా!

॥వద్దు॥

చరణం: పండుగంటు పబ్బమంటు, పురుడంటూ, పుణ్యమంటూ
ఆఫీసరు మెప్పుకని, కులపోడి తప్పుకని
తిండికి బట్టకు బిడ్డలు మలమల మాడుతు వుంటే
సిగ్గులేక సారాయి మత్తుల పడిపోకురా!

॥వద్దు॥

చరణం : పొలాలన్ని చదును చేసి, నారుపోసి, నీరు పోసి
పగలనక, రేయనక పంటలన్నీ పండించే, మన
రైతులకు, కూలీలకు ఋణమంటూ, ఇల్లంటూ
ఓట్లకొరకు ఇప్పసారా పొయ్యకురా నాయకుడా!

॥వద్దు॥

**డా॥ నాగినేని భాస్కరరావు**, M.B.B.S., F.C.G.P.



ఖమ్మంజిల్లా, బనిగండ్లపాడులో 1949 నవంబరు 1న జననం. మధిర కొత్తగూడెం, హైదరాబాదులో విద్యాభ్యాసం చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి M.B.B.S., పట్టా పుచ్చుకొని, మేధోవలసను వ్యతిరేకించి 1976 నుండి 1998 వరకు మధిరలో నాగినేని నర్సింగ్‌హోమ్ ను నిర్వహించి ప్రస్తుతం కూకటపల్లి, హైదరాబాదులో శివానంద రీహాబిలిటేషన్ హోంలో మెడికల్ ఆఫీసరుగా పని చేస్తున్నారు.

అనేక ఉచిత ఆరోగ్య శిబిరాలను, ఉచిత నేత్రవైద్య శిబిరాలను నిర్వహించారు. 1976 నుండి IMA, ఖమ్మం బ్రాంచి కార్యవర్గ సభ్యులుగా&1993 నుండి IMA, ఇండియా జీవితసభ్యులుగా కొనసాగుతున్నారు. 1987 లో భారతజ్ఞాన విజ్ఞాన యాత్ర స్థానిక కన్వీనరుగా&1988-92 వరకు ఆంధ్రప్రదేశ్ జన విజ్ఞాన వేదిక రాష్ట్ర కార్యవర్గ సభ్యునిగా, స్థానిక సంస్థ అధ్యక్షునిగా పనిచేశారు. అనేక పాఠశాలల్లో, జూనియర్, డిగ్రీ కళాశాలల్లో, యితర వేదికలపై ఆరోగ్య సంబంధమైన అనేక ప్రసంగాలు చేసారు. AIR, లో, పత్రికల్లో కవితల ప్రసారం, ప్రచురితం.

పలు సాంఘిక నాటక, నాటికలలో పలు పాత్రలు ధరించారు. 1970 గాంధీమెడికల్ కాలేజీ 'బెస్టు యాక్టరు' బహుమతిని, 1989లో మధిరలో నిర్వహించిన నాటక వారోత్సవాల్లో 'ఉత్తమ ద్వితీయ నటుడు' బహుమతిని అందుకున్నారు. మహామంత్రి తిమ్మరుసు&యుగంధరుడు - పిచ్చివాడు&చాణక్య వంటి చారిత్రాత్మక పాత్రలు&సుమంతుడు, చోళరాజు, కుబేరుడు, విశ్వామిత్రుడు, అశ్వత్థామ మొ॥ పౌరాణిక పాత్రలను పోషించారు.

**ఇతర ప్రచురణలు:** 1) మిత్రుడు సుధామతో కలిసి 1974లో 'మేం', కవితా సంకలనం. 2) 1988 లో దేశం కోసం శాస్త్ర విజ్ఞానం. 3) 1991 లో ఆక్సిజన్, కవితా సంకలనం. 4) 2000లో సమాజశిల-కవితా సంకలనం. 5) 2001 లో వ్యక్తిత్వ వికాసము-ఆరోగ్య సూత్రాలు.